REG.No.M.2185 REG.No.N 45

The First Telugu Bi-weekly in Andhra Desa, The only Telugu News Paper for H E H The Nizam's Dominions.

# గోలకొండ పత్రిక

ప్రతి బుధవారము శనివారము ప్రకటింపఁబడును

హైదరాబాదు—దక్కను

**GOLAKONDA PATRIKA.** HYDERABAD Dn

సంపుటము ౫ } ప్రమోదూతనామ సంవత్సర భాద్రపద బ॥ ౧౦ బుధవారము **17—9—30** { సంచిక ౩౬

## ఏజెంట్లు కావలయును

మా పత్రికకు చందాదారులను, కూర్చుటకు దిగువ స్థలములలో ఏజెంట్లుకావలయును:—

౧. సికింద్రాబాదు, ౨. భువనగిరి, ౩. జనుగామ, ౪. వరంగల్లు, ౫. మహబూబాబాదు ౬. ఖమ్మం, ౭. వికారాబాదు, ౮. మహబూబునగరు ౯. నిజామాబాదు, ౧౦. బెజవాడ. ౧౧ కరీంనగరము, ౧౨. నాందేడు, ౧౩. గుల్బర్గా, ౧౪. సూర్యాపేట, ౧౫. మిర్యాలగూడెం, ౧౬. దేవరకొండ, ౧౭. ఆసిఫాబాదు

వివరములకై దిగువవారికి వ్రాయుడు.

మేనేజరు
గోలకొండ పత్రిక
త్రూపుబజారు హైద్రాబాద్ దక్కన్.

# ఊహాపోహలు:— అంతరంగికోద్దేశ్యమేమి?— ప్రజాప్రాతినిధ్యము— ఆలస్యమేల?— టైమ్సు పత్రికపై అనురాగము—మనరాష్ట్రపు ప్రఖ్యాతి—పేరుపెద్ద యూరుదిబ్బ—సహీఫాసముద్రయానము—

ప్రజావత్సు విద్యామహాసభ యొక్క ప్రాముఖ్యము దానిపై చేయబడుచున్న విమర్శనల వలన తెలిసికొనవచ్చును. ఈవారములో జననమొందిన «మున్షూర్" అను ఉర్దూ దైనికపత్రిక ఈ సభా తీర్మానములను సమర్థించినది రహబరెదక్కన్ బహిరంగసభల గష్తీ న్యాయసమ్మతమని వాదించ నీపత్రిక అసర్థకమని సూచించుటయేగాక వాక్స్వాతంత్ర్యము, ముద్రణా స్వాతంత్ర్యము ప్రజల జన్మ హక్కుయని చాటినది దీనివలన రాష్ట్రమునందలి ముస్లిముల ముఖ్యోద్దేశము ప్రజలు ఈ గష్తీని రద్దు చేయుటకై కోరుచున్నారని విదితము కాకపోదు. ఇకనైనను రహబరెదక్కన్ తన పొరపాటును సవరించుకొనుగాక యని కోరెదను

* * * *

## అంతరంగికోద్దేశ్యమేమి?

«మన్షూర" పత్రిక ప్రజావత్సువిద్యా మహాసభకు విమర్శించదగిన అంతరంగికోద్దేశ్యము కలదని సూచించెను అది యేదియో వివరించియుండిన బాగుండెడిది. నిజముగ అట్టి యుద్దేశము రాజభక్తికిని, దేశభక్తికిని, విరుద్ధముగా నుండిన దానిని విడనాడుటయే మేలు. ఉద్దేశమేమిటో తెలుపక ప్రస్తుత పరిస్థితులను బట్టి వివరించుట నవసరమని ఒక్కమాట వ్రాయుట ఈ మహాసభయెడ అన్యాయము చేసినట్లే యగును ప్రభుత్వము వారి సి ఐ డి. శాఖకన్న ఈ పత్రికాధిపతులు రహస్య సంగతులు కనుగొనగల్గిరా? ఆహా! వీరి సూక్ష్మ దర్శిత్వమును నేమని పొగడవలయును వీరికీశక్తి యుండుటచే ముందు వీరు ప్రభుత్వము వారికి అమిత సహాయము చేయగలుగుదురు నిజము విచారించిన అట్టి యుద్దేశ్యమే ఈ మహాసభా సంస్థాపకులకుండిన ప్రభుత్వమువారు ఈసభా సమావేశమున కనుమతి నొసగకుండెడివారే. ఇక అంతరంగికోద్దేశ్యమును బహిరంగ రహస్య మొనర్పవలయునని «మన్షూర" పత్రికాధిపతులను కోరుచున్నాను.

* * * *

## ప్రజా ప్రాతినిధ్యము

ఇంతియగాక ఈపత్రికయందు సూచింపబడిన స్థానిక సంఘముల ప్రాతినిధ్య విషయము ప్రశంసింపదగినది ప్రజలీవిషయమున ఎన్నియో మహజరులు ప్రభుత్వ సభాధ్యక్షులకు పెట్టుకొనిరి. మహాసభలయందు తీర్మానింపబడెను. కాని యింత వరకు అమలునకు రానులేదు. సంస్థాన ప్రజలు బాధ్యతాయుత ప్రభుత్వమునకై కోరుచున్న యీ సమయమున, రౌండుటేబిల్ సభలో భావి పరిపాలనా విధానము గూర్చి చర్చింపబడనున్న కాలమున, స్వదేశ సంస్థానములలో నాయకమణియని వన్నెకెక్కిన నిజాం రాష్ట్రమున తుదకు స్థానిక సంఘములలోనైనను ప్రజాప్రతినిధులు లేకుండుట శోచనీయము. మన రౌండుటేబిల్ సభా ప్రతినిధులు లండనునగరమున ఈరాష్ట్రము స్థితిగతులను గూర్చి యేమని విన్నవింతురో నిజస్థితులు వెల్లడించిన స్వాతంత్ర్య ప్రియులగు బ్రిటిషువారేమి జవాబు చెప్పెదరో యని తహతహల పడుచున్నాను. మన ప్రతినిధులిట్టి పాపమునకు బోరనియే నా విశ్వాసము

* * * * *

## ఆలస్యమేల?

ఈ సంస్కారము ప్రవేశపెట్టుట కేల ఆలస్యము చేయబడుచున్నదో తెలియదు ఇంకను ఇట్టిసభలు జరుపుటకు ప్రజలు అర్హులు కాలేదా? వందలకొలది ఉస్మానియా పట్టభద్రులను చూచిన పిమ్మట మనరాష్ట్రమున ఈ భారమును నిర్వహించు శక్తిగలవారు లేనేలేరని చెప్పజాలము. వారికీ సభల విషయమున తెలియదని నుడువజాలము. తుదకు భారతదేశములో నాలుగవస్థానము వహించు రాజధాని నగరమున పురపారిశుద్ధ్య సంఘ సంస్కార చట్టమునైనను సంవత్సరములు గడచినను వెలుతురులోకి తేకుండుటకు కారణములేవైన గలవా? నామకార్థము ప్రతినిధులుగల ప్రస్తుత పురపారిశుద్ధ్య సంఘమైనను ఈవిషయమున శ్రద్ధ నెరపకుండుటయేమి ఇదేమిచిత్రమో నాయూహకు తట్టుట లేదు ప్రజాప్రాతినిధ్యమువలన ప్రభుత్వ భారము తగ్గును. అన్నిపనులును వారే నిర్వహించవలసిన అగత్య ముండదు. గొప్ప జీతములను స్వీకరించు అధికారులు గొప్ప పనులు చేయుటయందు నిమగ్నులై యుండవచ్చునుకదా?

* * * *

## టైమ్సుపత్రికపై అనురాగము

లండను టైమ్సు "ఇండియా వీక్ లీ అబ్ జర్వర్" పత్రికలను మన ప్రభుత్వమువారు ౧౦ వేలవరకు కొని హైదరాబాదు ఘస్తుఫారము మొదలుకొని తక్కువ తరగతుల పిల్లలందరికిని ఉచితముగా పంచిపెట్టినారు అందు వైసు వారెను హేస్టింగు పటములు ఆర్టుపేపరుపై అత్యుత్తమముగా అచ్చు అయినవి కలవు చాలమందిపిల్లలు వీనిని మాత్రముంచుకొని మిగత వానిని పారవేసినారు ఈ పటములుకూడ మన దేశమును బానిసతనముక్రిందికి తెచ్చినవారివి అవియు నిండ్లలో నుంచుట హైందవులకు గౌరవప్రదము కాజాలదు ఇట్టి వ్యర్థవస్తువులపై మన ప్రభుత్వమువారేలనో ద్రవ్యమునువృథా చేయుచున్నారు ఈ రాష్ట్రములో ఎన్నియో పత్రికలు దివాలతీసియున్నవి. కొన్ని పత్రికలను ప్రభుత్వమువారే నిలిపివేసి పుణ్యము కట్టుకొన్నారు. మనరాష్ట్రములో నిప్పుడుండు పత్రికలుకూడ సరియైన స్థితిలోలేవు కాని లండను నగరములోని టైమ్సుపత్రికపై మనవారికెంత గాఢమైన యనురాగము గలిగినదో పాపము వారికి వేనవేలుఇచ్చి వారి పత్రికలను మన పిల్లలకు గాలిపటములకు మున్నగు వానికి పనికి వచ్చునట్లుకూడ ఏర్పాటు చేసియున్నారు

* * * * *

## మనరాష్ట్రపు ప్రఖ్యాతి

నిజాం రాష్ట్రము స్వదేశ సంస్థానములలో నాయకమణి. మన సంస్థానముకన్న నెంతయో చిన్నదగు తిరువాన్కూరు సంస్థానము విద్యావిషయమున అన్ని రాష్ట్రములకు మిన్నయై ప్రఖ్యాతి నార్జించినది అన్నిటికన్నను చిన్నదగు ఔంధు సంస్థానము ప్రజాప్రాతినిధ్యము నొసగి గౌరవము పొందుచున్నది బరోడా సంస్థానము గ్రంథాలయములను స్థాపించుచు విద్యాభివృద్ధి విషయమున లగినంత ప్రయత్నమొనర్చుచు విఖ్యాతి బొందినది మైసూరు సంస్థానము పారిశ్రామికాభివృద్ధి గావించుచు పొగడ్తల బడయుచున్నది ఇదియది యననేల ప్రతి సంస్థానము కూడ నేదో యొక విషయమున ప్రోత్సహనీయమే యగుచున్నది ఈ రాష్ట్రము కూడ ఏదో యొక విషయమున ఖ్యాతి బడసినది మన ప్రభుత్వము దానకర్ణులని ప్రసిద్ధి జెందినది

* * * * *

## పేరుపెద్ద యూరుదిబ్బ

ప్రభుత్వమువారు అనవసర వ్యయముల నేల యొనర్తురు? ఈ ప్రశ్నకు తగినజవాబు వెంటనే దొరకును. మన ప్రభుత్వ దృష్టియందు ప్రాథమిక విద్యకై ద్రవ్యము వినియోగించుటయు, గ్రంథాలయ స్థాపనకై ధనము వెచ్చించుటయు, విద్యాభివృద్ధికై ధనవ్యయ మొనర్చుటయు మున్నగు ప్రజాహిత కార్యములు అనవసరముగా దోచును కాని బ్రిటిషు ఇండియా యందలి ముఖ్యముగా ఉత్తర హిందూస్థానములోని విద్యా సంస్థలకు ధన సహాయము చేయును ఇందుచేతనే వీరిని ఇతర రాష్ట్రములవారు స్తుతించెదరు. అందుచే పేరుపెద్ద యూరుదిబ్బ యను సామెత ఈ రాష్ట్రమున కన్వయించుచున్నది

* * * * *

## సహీఫా సముద్రయానము

సహీఫా పత్రికాధిపతులు ఇంగ్లండునకు రౌండుటేబిల్ మహాసభ దర్శనార్థము వెడలుటకు ప్రభుత్వమువారిని సహాయము కోరుచున్నారట. వీరు ప్రభుత్వ సహాయమున రౌండుటేబిల్ మహాసభకు వెడలి దేశమునకేమి లాభ మొనగూర్తురో తెలియకున్నది. ఇంతేకాక నైజాంరాష్ట్రమునందు యొక్క సహీఫాపత్రికయే కలదా? సహీఫా కాక ఇంకను నాలుగు ఉర్దూ దినపత్రికలు కలవు కదా. కావున నీ పత్రికాధిపతులుగూడ తమకు రౌండుటేబిల్ మహాసభలో పాల్గొను కోరికగలదని ప్రభుత్వ సహాయమును గోరవచ్చును. ఇందరు పత్రికాధిపతులకు ధనసహాయముచేయుటకు ప్రభుత్వమునకు వీలు గలదా వీరికి ప్రభుత్వమువారేల సహాయము చేయవలయును? వీరు తమ పత్రికకు వేరు రావలయునన్న రౌండుటేబిల్ సభ కార్యక్రమము ఏనాటిది ఆనాటికి నిస్తంతిద్వారా వంపి తమ పత్రికద్వార నిజాం రాష్ట్రీయులకు దెలిపి వారి పొగడ్తలందవచ్చును. కాని స్వప్రయోజనమునకై ప్రభుత్వమువారినేల ధనము కోరవలయునో ఇదెట్టి న్యాయమో నాకు దెలియకున్నది.

«మన గంధర్వుడు"

## గోలకొండ బుక్ డిపో

| | | |
|---|---|---|
| ౧ | రెడ్డికుల నిర్ణయచంద్రిక | ౧-౪-౦ |
| ౨ | సంఘోద్ధరణము | ౦-౫-౦ |
| ౩ | పంచముల చరిత్ర | ౦-౮-౦ |
| ౪ | భారతీయ స్త్రీ ధర్మములు | ౦-౮-౦ |

ఈ నాలుగు గ్రంథములు ఒకేసారి తెప్పించుకొనువారికి ౧ తిప్పన్న చరిత్రము ౨ జీడికంటి రామశతకము ౩ బమ్మెర పోతనామాత్య విజయము ౪ క్షయవ్యాధి ౫ కృష్ణాలహరి మొత్తము ఒక రూపాయి పుస్తకములు ఉచితముగ నివ్వబడును. తపాల ఖర్చులు వేరు.

కొత్త కుటుంబాలియ్యతులు నూటికి రు 3 లు

గోలకొండ బుక్ డిపో
౧౫౦౯, తూర్పుబజారు హైద్రాబాదు (దక్కన్)



## గోలకొండ పత్రిక

ఏజంట్లు

హైదరాబాదు

| | | |
|---|---|---|
| 1 | ఎం॥ ఆర్. మూర్తి | గౌలిగూడ |
| 2 | నా॥ గౌరీశంకరవర్మ | రెసిడెన్సీబజారు |
| 3 | కాళిదాసు బి పురోహిత్ | ,, |
| 4 | ఎం॥ యూ॥ మొహతా హ్యాదరు మసీదు ఎదుట | గౌలిగూడ |
| 5 | ఎవానీ అండుకో నల్లగొండ | |





## గోలకొండ పత్రిక

తూర్పు బజారు హైద్రాబాదు దక్కన్.

సంవత్సరము చందా

| | | |
|---|---|---|
| | | రు. ౭-౦-౦ |
| అర్ధ | ,, | ౩-౧౨-౦ |
| విడి పత్రిక | | ౦-౧-౪ |

Printed and Published by G. Ramakrishna Reddy at Golkonda Power Press, Hyderabad, Dn. Editor K. Balakrishna Reddy.